

# హరి,

# మాయా తోట

జాన్సన్





ఒక రాత్రి హరి తన మంచం మీద నుంచి లేచాడు. వంగ
వన్నె క్రేయాన్‌ని, చందమామని వెంట తీసుకుని ఒక
అద్భుతమైన మాయా తోటలో విహరించటానికి
బయలుదేరాడు.



అయితే ఆ తోటలో ఒక్క మొక్క కూడా పెరగటం లేదు. అది మాయా తోట అని హరికి తెలియకపోతే దానిని తోట అని కూడా పిలిచి ఉండేవాడు కాదు.

సమస్య ఏమిటో తెలుసుకోటానికి రాజు దగ్గరకు వెళదామని అనుకున్నాడు హరి.



రాజు మహలులో ఉంటాడు. రాజు ఉండేటంత పెద్ద మహలు వేయాలని హరి నిశ్చయించుకున్నాడు.

సామంతులను, యువరాజులను కలిసి హరి తన సమయాన్ని వృధా చేయదలుచుకోలేదు.



ఇది రాచమహలు అనటంలో సందేహం లేదు. దీనికి పెద్ద పెద్ద బురుజులు ఉన్నాయి. రాజుకి ఇష్టం లేనివాళ్లను రానివ్వకుండా ఉండటానికి కిందకి జార్చే ద్వారం ఉంది.

ద్వారం గీయటం పూర్తయ్యేసరికి తాను బయట ఉండిపోయానని హరి గుర్తించాడు.



తలుపు తియ్యమని హరి ఎంత

పెద్దగా అరిచినా ఎవరూ వచ్చి

తలుపు తియ్యలేదు.



మాయా తోటలో, కోట గోడ పక్కగా హరి

నడవసాగాడు. అప్పుడు అతడికి అతని వంగ

వన్నె క్రేయాన్ గుర్తుకు వచ్చింది.



చిన్న ఎలక కంటే చిన్నగా ఉన్న వ్యక్తి కోట

లోపలికి వెళ్లగలుగుతాడు.

వంగోనవసరం లేకుండానే హరి ఆ

ఎలక కలుగు లోకి వెళ్లగలిగాడు.



ఎలక కలుగులోంచి హరి కోటలోకి వెళ్లాడు. తన

తోపాటు రమ్మని ఎలకను కూడా పిలిచాడు హరి.

కానీ, అది బయటే ఉంటానన్నది.



పెద్ద కోటను పరికించి చూసిన హరికి తాను

చాలా చిన్నగా ఉన్నానని అనిపించింది.



ఎలక కంటే చిన్నగా ఉన్న వ్యక్తిని రాజు

పట్టించుకోక పోవచ్చు. హరికి తన వంగ వన్నె

క్రేయాన్ మళ్లీ గుర్తుకు వచ్చింది.



హరి నాలుగున్నర మెట్లు అంత

ఎత్తు ఉంటాడు. దానిని అతడు సరి

చూసుకున్నాడు.



తరవాత, రాజుని వెతుక్కుంటూ

అతడు మెట్లు ఎక్కసాగాడు.



అతడు మెట్లు ఎక్కుతూ వెళ్లాడు, ఎక్కుతూ

వెళ్లాడు. ఇంకా ఒక్క మెట్టు కూడా

ఎక్కలేనంతగా అతడు అలసిపోయాడు.



అయితే అతడి అదృష్టం బాగుండి ఇక మెట్లు

లేవు. అతడు ఆఖరి మెట్టు ఎక్కేశాడు.



అయితే అతడికి రాజు ఇంకా కనపడలేదు. రాజులు

సింహాసనాల మీద ఉంటారని మాత్రం హరికి తెలుసు.



రాజు సింహాసనం హరికి ఎంతో బాగుందని అనిపించింది.

కొంచెం సేపు దాని మీద విశ్రాంతి తీసుకుంటే రాజు ఏమీ

అనుకోడులే అని హరి అనుకున్నాడు.



సింహాసనం మీద హరి కూర్చున్నాడు. కాసేపు

రాచ మకుటం పెట్టుకుంటే ఎలా ఉంటుంది?





కొంచెం సేపు హరికి కిరీటం బాగానే

ఉన్నట్టు అనిపించింది. తరవాత అది చాలా

బరువుగా అనిపించసాగింది.

అప్పుడు, హరి కిరీటాన్ని పెట్టుకున్నాడు.



దాంతో అతడు కిరీటాన్ని రాజు

తల మీద పెట్టేశాడు.



కిరీటాన్ని పెట్టుకోనిచ్చినందుకు రాజు   హరి ధన్యవాదాలు

చెప్పాడు. రాజు ఉదాసీనంగా ఉన్నట్టు హరికి అనిపించింది

– తోటలో మొక్కలు ఏవీ లేవని అలా ఉన్నాడేమో.



సమస్యకి కారణం మాయావా, రాక్షసుడా అని రాజుని హరి

అడిగాడు. రాజు అయోమయంలో ఉన్నాడు. అంతేకాకుండా,

నిస్సహాయుడిగా, విచారంగా కూడా కనిపించాడు.



అది మాయావి అయినా, రాక్షసుడు అయినా

కనపడకుండా ఉండేవి అయి ఉండాలి.

ఆందోళనపడవద్దని రాజుకి హరి చెప్పాడు.



తన వంగ వన్నె క్రేయాన్‌ని ఊపుకుంటూ ఆ

అదృశ్య మాయావి, లేదా రాక్షసుడిని వెతుక్కుంటూ

వెళ్లాడు హరి. అయితే, పొరపాటున క్రేయాన్‌తో

గోడ మీద ఒక కన్నం ఏర్పడింది.



తన పొరపాటుకు హరి కొంచెం ఇబ్బందిపడ్డాడు. అయితే,

మహలు లోంచి బయటపడటానికి అదే తేలిక దారి అని

హరికి అనిపించి దానిలోకి దూరాడు.



కన్నంలోంచి బయటకి చూసిన హరికి అతడు చాలా

ఎత్తు మీద ఉన్నాడని తెలుసుకున్నాడు.



అతడు కిందకి దిగాలంటే ఒక కోట గోపురం

లాంటి దాని సహాయం కావాలి.



కోట గోడకి అయిన కన్నాన్ని హరి ఒక అందమైన,

ఉపయోగకరమైన గడియారంతో నింపాడు. దానిని చూసి

చాలా ఆలస్యమైపోయిందని అనుకున్నాడు.



కనపడని మాయావి లేదా రాక్షసుడిని వెదకటానికి

అతడు వెంటనే కిందకి దిగసాగాడు.



అయితే, అతడు గోపురం మీద నుంచి దిగటం

లేదు, అది కోసుగా ఉన్న ఒక టోపీ.



అది రాక్షస మాయావి!!



వంగ వన్నె క్రేయాన్‌తో అంతా స్పష్టమవుతోంది –

అది కనపడని రాక్షస మాయావి. మాయా తోటలో

ఒక్క మొక్క కూడా లేకపోవటం ఆశ్చర్యం

కలిగించటం లేదు.



పెద్ద పెద్ద కాళ్లతో తోటనంతా రాక్షస మాయావి

తొక్కుతుంటే అక్కడ మొక్కలు ఎలా పెరుగుతాయి

అని హరి తనలో తాను అనుకున్నాడు.



సమస్య ఏమిటో తెలిసింది కాబట్టి ఆ రాక్షస మాయావిని

మాయా తోట లోంచి హరి తరిమేస్తే చాలు.

దోమలు! తోటలోంచి ఎంతటి వారినైె దోమలు

బయటకు తరిమెయ్యగలవని హరికి తెలుసు.



కాసేపట్లోనే రాక్షస మాయావిని దోమలు

తోటలోంచి తరిమివేశాయి. హరిని కూడా

దోమలు తోటలోంచి తరిమివేస్తున్నా .

దోమల నుంచి తప్పించుకోటానికి

హరి పొగబెట్టాడు.



నిప్పు లేనిదే పొగ రాదని ఎవరో, ఎప్పుడో

అనటం హరికి గుర్తు వచ్చింది.



మంటలు ఆర్పడానికి మొదట గంటల కారుని

పిలవాలని హరి అనుకున్నాడు. అయితే దానికంటే

తేలికగా వానని పిలవచ్చని అతడికి తెలిసింది.





వానకి అన్నీ తడిసాయి – చివరికి హరి కూడా తడిసిపోయాడు. కానీ, పూలకు వాన మంచిదని హరి అనుకునా .

అతడి ఆలోచన నిజమని తేలింది. తోట నిండా పూలు పూయసాగాయి.



తోట అంతటా పూలు పూయసాగాయి. ఎన్ని పూలు పూచాయో హరి లెక్కపెట్ట లేకపోయాడు. ఆ పూలన్నీ ఎంతో అందంగా ఉన్నాయి.

మరునాడు ఉదయం కోట నుంచి బయటకు చూసిన రాజు ఎంతో సంతోషిస్తాడని హరి అనుకున్నాడు.



చివరి పువ్వు, ఆశ్చర్యకరంగా పువ్వు

కాకుండా అందమైన దేవదూత అయ్యింది.



ఆ దేవదూత తన మంత్రదండాన్ని

ఊపి కోరిన కోరికలన్నీ తీరుస్తానని

హరికి చెప్పింది.



ఏం కోరుకోవాలో ఆ క్షణంలో హరికి అర్థం కాలేదు.

దాంతో మర్యాద కోసమని తాను కోరుకున్నప్పుడు

తీరేలా ఒక్క వరం ఇవ్వమని హరి అడిగాడు.



ఇంటికి తిరిగి బయలుదేరిన హరి ఎప్పుడైనా

అవసరం వచ్చినప్పుడు ఈ కోరిక

ఉపయోగపడుతుంది అనుకున్నాడు.



అప్పటి దాకా ఉత్సాహంగా ఉన్న హరిని

ఒక్కసారిగా నీరసం ఆవహించింది. అతడు

కాసేపు విశ్రాంతి తీసుకోవాలని అనుకున్నాడు.



వాన కారణంగా నేల ఇంకా తడిగా

ఉండటంతో అతడు ఒక చిన్న తివాచీ

మీద కూర్చున్నాడు. తరవాత -



ఈ తివాచీ ఎగరగలిగితే బాగుండును  అని

అనుకున్నాడు. ఆ వెంటనే తివాచీ గాలిలోకి

లేచినట్లు అతడికి అనిపించింది.



ఎంతో ఎత్తులో, ఎంతో వేగంగా ఆ

తివాచీ ఎగురుతోంది.



తివాచీ వేగంగా వెళుతూ చందమామని కూడా వెనక్కి నెట్టేసింది. తివాచీని ఆపటం కాదు కదా దాని వేగాన్ని తగ్గించటం కూడా తనకి తెలియదని హరి గుర్తించాడు.



దేవదూతను రెండు కోరికలు అడిగి ఉంటే తివాచీని ఆపటానికి ఉపయోగించి ఉండేవాడిని కదా అనుకున్నాడు హరి.



అయితే, వంగ వన్నె క్రేయాన్

ఇంకా హరి దగ్గరే ఉంది.



ముందు గదిలో అమ్మ కూర్చునే పెద్ద సోఫా వెనకాల

తివాచీ దిగేటట్టు హరి చేశాడు. అందులో కూర్చుని

వాళ్ల అమ్మ ఉన్నితో బట్టలు అల్లుతూ ఉంటుంది.



నిద్రపోటానికి ముందు ఒక కథ

చెప్పమని హరి అడిగాడు.

అయిపోయింది